విధములగు దానముల నొసరించియు సంతోషము నందింప వలయును. ఇట్లు చేసినయాతని కతిరాత్రయాగము నాచ రించినఫలము గలుగును. ప్రతిపర్వమునను జెప్పిన యాయా క్రతువులఫలము లభించును. వాచకుఁడును—బదములును, నక్షరములును విస్పష్ట మగునట్టి సుస్వరముతో నీభారతమున భవిష్య మనుభాగమును వినిపింపవలయును. ఆవల బ్రాహ్మణ భోజన మయినతరువాత మంచిభోజనముచేఁ బరితుష్టుఁ డయిన వాచకుని యథాశక్తి దానము నొసఁగి సంతృప్తి నొందింప వలయును. వాచకుఁడు సంతృప్తి నొందినచో నెల్లదేవ తలును మహోత్తమమగు సంతుష్టి నందుదురు. బ్రాహ్మ ణులు సంతృప్తు లగుచో నెల్లవేలుపులును బ్రసన్ను లగు దురు. కావుననే యెల్లకోరికల నొసఁగియు, ననేకవిధముల వారికి మేలుల నొడఁగూర్చియు బ్రాహ్మణులను సంతోషపెట్ట వలసియున్నది. జనమేజయమహారాజా! యిట్లు నీ వడిగిన భారతశ్రవణవిధానము నంతయును వివరించితిని. సావ ధానుఁడవు గమ్ము. ఉత్తమశ్రేయమును గోరువాఁడు భారత శ్రవణమునందును, పారణములయందును యత్నవంతుఁడై పైవిధానము నాచరింపవలయును. ఎల్లపుడును వినవలసినది భారతము. ఎల్లవేళలను గీర్తింపఁదగినది భారతము. అదియింటి లోనున్నను జాలును. జయమును గరతలామలకము గావింపఁ జాలునది భారతము. పరమపుణ్యామేద యన భారతము. అనేకవిధము లగు కథలెల్ల వెలసినతావేది యన భారతము. దేవతలచేతనుగూడ సేవింపఁబడునది భారతము. పరమపద మునకుఁ బరమసాధనము భారతము. సర్వశాస్త్రములలోను

నుత్తమమైనది భారతము. వేయేల? భారతమువలన మోక్షము కరతలామలక మగును. ఇది యథార్థము.

రాజేంద్రా! యొకమాటఁ దెలిపెద వినుము. మహాభారతాఖ్యానమును, భూమిని, గోవును, సరస్వతిని, బ్రాహ్మణులను, నారాయణుని గీర్తించునాతనికి నధమగతులెన్నఁటికిని గలుగవు. పవిత్రము లయినవేదమునను, రామాయణమునను, నీ మహాభారతమునను మొదలను, నడుమను, దుదిని, నెల్లయెడలను నారాయణుని నామకీర్తనము నిండారియున్నది. విష్ణుకథల కెల్ల నేది స్థానమో, సనాతనములగు శ్రుతు లెల్ల నెచట సాక్షాత్కరించునో యట్టి యీ మహాభారతము పరమపదము నందఁగోరినయాతఁ డెల్లఁ బఠింపఁ దగినది. ఇయ్యది పరమపవిత్ర మైనది. సర్వధర్మములకును నిదర్శన మియ్యదియే. సర్వగుణసమృద్ధ మగు నీ భారతము నభ్యుదయమును గోరువాఁ డెల్ల వినఁదగును. శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను నార్జింపఁబడిన పాప మంతయును నీ భారతముచేఁ జీకటి సూర్యోదయముచేతనుంబలెఁ బటాపంచ లయిపోవును. పదునెనిమిది పురాణములను వినుటవలన నెట్టిఫలము గలుగునో యాఫల మెల్ల విష్ణుభక్తియుక్తుఁడై యీ భారతమును వినినయాతనికి నిస్సంశయముగ లభించును. స్త్రీలును, బురుషులును గూడ దీనిచే విష్ణులోకము నందుదురు. పుత్త్రులు గావలయు నని కోరు స్త్రీ లెల్లరును నీ విష్ణుసంకీర్తనమును వినవలయును. పైఁ జెప్పినఫలము నందఁగోరువాఁడు వాచకునకు నైదుమాడల బంగారమును గాని, లేక యథాశక్తి సువర్ణమునుగాని దాన మొసఁగవలయును. ఆత్మశ్రేయమున

గోరినవాఁడు దూడతోఁగూడ నొక కపిలధేనువును గొమ్ములకు బంగారము పొదిఁగి పైన వస్త్రమును గప్పి వాచకునకు దానము చేయవలయును. మఱియును నాతనికిఁ జేతులకును, జెవులకును ధరించు నాభరణములను, ధనమును, విశేషించి భూదానమును నొసఁగవలయును. భూదానమునకు సాటివచ్చు దాన మిప్పటికి లేదు; ఇంకముందుఁ గలుగదుగూడ.

ఇట్టి యీ భారతము నెల్లవేళలను వినువాఁడును వినిపించువాఁడును దమతమ పాపముల నెల్లను విడఁదీసికొని విష్ణులోకమున కేఁగుదురు. దీనిని వినినను, వినిపించినను మానవుఁడు తన పితరులను బదునొకండు తరములవారిని, భార్యాపుత్త్రులను, దన్నునుగూడ నుద్ధరించును. ఈ భారతము ముగిసినతరువాత దీనికిఁ బదియవభాగము హోమమునుగూడ నొనరింపవలయును. జనమేజయనృపాలా! యిట్లు నీ యడిగిన యర్థమెల్ల నీ కడ వివరించితిని.

గద్య:—ఇది విద్వాన్ అవధానము చంద్రశేఖరశర్మ ప్రణీతంబైన హరివంశాంతర్గత మగు భారతశ్రవణ విధియను పేరిటి యధ్యాయము.

తత్స ద్బ్రహ్మార్పణ మస్తు

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

---

Ananda Press, Madras